**పరమగురువులు**

**పరమపూజ్య స్వామిదయానంద సరస్వతి**

**మరియు పరమపూజ్య స్వామి**

**పరమార్థానంద సరస్వతులవారి**

**శ్రీ చరణములకు సమర్పించుకొనుచున్న**

**భక్తి కుసుమము ఈ**

# ఆచార్య దేవోభవ

**- స్వామిని సత్యవ్రతానంద సరస్వతి**



**విషయసూచిక**





# ఆచార్య దేవోభవ

**గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।**
**గురురేవ పరంబ్రహ్మా తస్మై శ్రీగురవే నమః ॥**

మన సంస్కృతిలో గురువును భగవత్స్వరూపులుగా పూజించెదము.

మానవునకు జీవితములో ఎందరో గురువులుందురు. జన్మనిచ్చి మంచి చెడులను నేర్పించుచు పెంచు తల్లి తొలి గురువు కాగా మంచి నడవడికను, వ్యవహారశైలిని నేర్పు తండ్రి రెండవ గురువు. విద్యాబుద్ధులను ఒసగు ఆచార్యుడు మూడవ గురువు.

అందుచేతనే వీరిని దైవసమానులుగా భావించి పూజనీయ స్థానము ఇవ్వబడినది.

**మాతృదేవోభవ । పితృదేవోభవ । ఆచార్యదేవోభవ ।**

(తై. ఉ.2.11.3)

ఈ ముష్వురితో పాటు భగవంతునితోను వ్యక్తికి జీవిత పర్యంతము సంబంధము కొనసాగుచుండును. మానవుని



యొక్క పరిపూర్ణమైన వ్యక్తిత్వ వికాసమునకు ఈ నాలుగు సంబంధములు ప్రధానమైనవి. ఈ అనుబంధములు మానవుని ఆధ్యాత్మిక ఉన్నతికి నాలుగు స్తంభముల వంటివి.

**గురువు అనగా ఎవరు?**

అజ్ఞానమును అనగా మనకు తెలియని విషయము గురించి వివరించి ఆ విషయ పరిజ్ఞానమును ప్రసాదించు వారు గురుస్థానమును పొందుదురు.

సంస్కృతములో గురువుని 'శాస్తా' అని సంబోధించెదరు.

**గుకారోస్త్వంధకారోవై రుకారస్తన్నివర్తకః ।**

**అంధకార నివర్తిత్వాద్గురురిత్యభిధీయతే॥** (గురుగీత)

'గు' అనగా అంధకారము, 'రు' అనగా నివర్తించువారు. అజ్ఞానమను అంధకారమును తొలగించువారు 'గురువు' అని అర్థము.

గురువునే 'ఆచార్యుడ'ని కూడా సంబోధించెదము.

**ఆచినోతి హి శాస్త్రాణి ఆచారే స్థాపయత్యపి ।**

**స్వయం ఆచరతే యస్మాత్తస్మాదాచార్య ఉచ్యతే ॥**

అనగా, శాస్త్రములోని విషయములను కూలంకషముగా తాము తెలుసుకొని వాటిని స్వయముగా ఆచరించుచు ఇతరులకు బోధించువారు 'ఆచార్యుడు'.

తండ్రి తన కుమారునకు బ్రహ్మోపదేశమును ఉపదేశించినప్పుడు అతడు 'గురువు' స్థానమును పొందును. ఆ తండ్రే కుమారునకు బ్రహ్మవిద్యను బోధించినప్పుడు అతని ఆచార్యత్వం మరింత ఇనుమడించి విశిష్టతను సంతరించుకొనును.

మంత్రదీక్ష, వ్రతదీక్ష, ఉపాసనలను బోధించు గురువులు ఎందరో ఉన్నారు.

వ్యాకరణము, సంస్కృతము, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషము మొదలగు అపరావిద్యలలో పాండిత్యము కలిగి బోధించు వారైనప్పటికి వారు 'గురువులు' మాత్రమే.

పక్షికి రెండు రెక్కలు ఏవిధముగా అవసరమో మానవునకు కూడా జీవితంలో అపరావిద్యతో పాటు



పరావిద్య కూడా అవసరము. విద్యలన్నిటికీ తలమానికం పరావిద్య (అక్షరవిద్య).

అటువంటి బ్రహ్మవిద్యను బోధించువారు 'పరమ గురువు'.

**"గృణాతి ఆత్మతత్త్వం ఉపదిశతి ఇతి గురుః"**

ఎవరు ఆత్మవిద్యను బోధించుట ద్వారా శిష్యుని యొక్క భవరోగమును తొలగింపగలరో వారే 'పరమగురువు'.

బ్రహ్మవిద్యను పొందిన తరువాత మానవునికి మరి నేర్వదగు విద్య ఏదియు ఉండదు. అన్ని విద్యలనూ పొందినట్లే.

ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి

కృష్ణ పరమాత్మ భగవద్గీతలో

**నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।**

(భ.గీ. 4:38)

ఆత్మజ్ఞానము కంటే పవిత్రమైనదేదియు లేదు అని వక్కాణించియున్నారు.



వ్యాసాచార్యులు, ఆదిశంకరాచార్యులు మొదలగు వారు పరమగురువుల కోవకు చెందినవారు.

ఒక వ్యాధి నుండి బయటపడుటకు మనిషి వైద్యుడిని ఆశ్రయించుట సహజము. వైద్యునికి మాత్రమే ఆ వ్యాధికి తగిన ఔషధమునిచ్చి అతనిని దాని నుండి బయట పడవేయగల సమర్థత ఉన్నది. కాని సంసారమను రోగము నుండి మానవునకు విముక్తినిచ్చుట సాధారణ వైద్యునికి సాధ్యముకాదు. అది ఒక్క ఆత్మవిద్యను బోధించు పరమ గురువుకే సాధ్యము.

'సంసారము'నకు కారణము ఆత్మ అజ్ఞానము. దీని చేతనే మానవుడు 'సంసారమను' సర్పమును చూచుచు భయభ్రాంతుడవుచున్నాడు. ధనము, బంధువులు, స్నేహితులు, కీర్తి ప్రతిష్టలు ఎన్ని ఉన్నప్పటికినీ తృప్తి పొందక ఏదో పొందవలెనను తపనతో, అసంతృప్తితో తాను 'పరిచ్ఛిన్నుడనని' దుఃఖించుచుండును. ఇదే సంసారము. తాను సంసారమను బంధముతో కట్టివేయబడి బద్ధుడనైనాని తలపోయుచు దుఃఖించుచుండును. మానవుడు నిజంగా బద్ధుడే ఐనచో ఎవ్వరూ అతనిని విడిపించలేరు. పరిచ్ఛిన్నుడైనచో ఎవ్వరూ అతనిని అపరిచ్ఛిన్నుడను కావించలేరు.



దీర్ఘకాలముగా కట్టివేయబడియున్న కట్టెలమోపు ముడి ఎలా పీటముడిగా మారునో మానవుడు చాలా కాలముగా సంసారమను బంధమునకు తాను కట్టబడినానను భావనతో దుఃఖించుచుండును. ఎలాగైతే బలమైన ఇంకొక త్రాడును తెచ్చి కట్టెల మోపును బిగించి మొదటి పీటముడిని సడలించినట్లుగా గురువు కరుణతో శాస్త్రము నుండి 'తత్త్వమసి' అను మహావాక్యమును బోధించి అతని అజ్ఞానమను పీటముడిని సడలించి అతనికి నీవు బద్ధుడవు కావు, ముక్తుడవు అనే జ్ఞానమును ప్రసాదించెదరు. ఇదీ జీవితములో గురువు యొక్క పాత్ర.

దేవాలయములోని దేవతామూర్తిలో ఎంతో ప్రశాంతత గోచరించును. ఆ దైవస్వరూపమే తనలో వున్నప్పటికిని మానవుని వదనంలో మాత్రం ఎందుకు దుఃఖపు క్రీనీడలు దోబూచులాడుచున్నవి?

భగవంతుని వదనములో తొణకిసలాడు చిరునవ్వు తాను ఆనందస్వరూపము అని తెలియజేయుచున్నది.

**ఆనందో బ్రహ్మేతివ్యజానాత్....**

ఆనందమే భగవత్స్వరూపము

అటువంటి బ్రహ్మ స్వరూపుడైన భగవంతుని తనలో కలిగి తానే ఆ బ్రహ్మ స్వరూపమై యున్న మానవునిలో ఆ ఆనందపు ఛాయలు ఏల కనుమరుగైనవి?

అది విడమరచి విశదీకరించి బోధించి మానవుని యొక్క దుఃఖమును తొలగించువారే పరమగురువు.

**ఆచార్యవాన్ పురుషోవేద** (ఛాం.ఉ.6.14.2)

జీవితంలో గురువును పొందిన వ్యక్తికి మాత్రమే జీవితమనగానేమిటి? జ్ఞానసముపార్జన ఏవిధముగా చేయవలెను? శాంతియుత జీవనమేవిధముగా గడుప గలము? అనునవి తెలియును అని పై మంత్రము ఉద్ఘాటించుచున్నది. కనుక గురుసాన్నిధ్యము మానవునికి శ్రేయస్కరము.

భగవద్గీతలో కృష్ణపరమాత్మ ప్రథమషట్కము (త్వంపద విచారణ)లో 'స్థితప్రజ్ఞుడి లక్షణములు', ద్వితీయ షట్కము తత్పద విచారణ)లో 'పరాభక్తుని లక్షణములు' మరియు తృతీయ షట్కము (అసిపద విచారణ)లో 'గుణాతీత



లక్షణము'లను వక్కాణించుట ద్వారా గురుచరణ భాగ్యము పొందిన మానవుడు పొందు ఉన్నతిని తెలియజేసినారు.

యాని స్థితప్రజ్ఞస్య లక్షణాని తాని ముముక్షోః సాధనాని

యాని పరాభక్తస్యలక్షణాని తాని ముముక్షోః సాధనాని

యాని గుణాతీత లక్షణాని తాని ముముక్షోః సాధనాని

అంటూ దుఃఖవిముక్తికై ప్రయత్నించు సాధకులు వీరిని ఆశ్రయించి అనుసరించవలెనని కృష్ణపరమాత్మ సెలవిచ్చారు.

**ఆత్మజ్ఞాన ఆవశ్యకత :**

సంసారమనునది 'దుఃఖము', 'అతృప్తి' మరియు 'బంధము' అను మూడు దోషములతో కూడినటువంటిది. దానికి ఆత్మజ్ఞానమే పరిష్కారము.

పుట్టిన ప్రతి జీవి వ్యాధి, ముసలితనము మరియు మరణమను మూడు రకముల బాధల నెదుర్కొనుట సహజము. ఈ విషయములనే భర్తృహరి తన 'వైరాగ్య శతకము'లో క్రింది శ్లోకము ద్వారా వివరించుచూ

**వ్యాఘ్రీవ తిష్ఠతి జరాపరితర్జయన్తీ**
**రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరన్తిదేహం ।**



**ఆయుః పరిస్రవతి భిన్నఘటాదివామ్భో**
**లోకస్తథా ప్యహిత మాచర తీత చిత్రమ్ ॥**

ముసలితనము పెద్దపులి వలె పంజావిసురుచూ క్షణక్షణము మానవుని భయాందోళనలకు గురి చేయును. పుట్టిన ప్రతి జీవికిది అత్యంత సహజము, అనివార్యము. పిల్లి బారినబడ్డ ఎలుక ఎలా చిగురుటాకువలె వణికిపోవునో అదేవిధముగా ముసలితనము వలన మానవుడు అల్లాడి పోవును. అయినప్పటికినీ ఇది విస్మరించి యౌవనగర్వముతో మానవుడు అది శాశ్వత మన్నట్లుగా ప్రవర్తించుచుండును.

ఏవిధముగా శత్రువు ఒక రాజ్యముపై దండెత్తి విజయమును చేజిక్కించుకొని పరాజితుడైన రాజుని కారాగారములో బంధించి ఆహారమునివ్వక చిత్రవధల పాలు జేయునో అదేవిధముగా వ్యాధులు ఈ శరీరమును చిత్రవధల పాలుజేసి బ్రతుకును దుర్భరము చేయును.

ఓటికుండలోని నీరు ఏవిధముగా ఒక్కొక్క బొట్టు కారుచు చివరకు కుండను ఖాళీగా మిగుల్చునో మనిషి యొక్క ఆయుష్షు కూడా ఒక్కొక్క క్షణము కాలగర్భములో కలిసిపోవుచూ అతడిని మరణమునకు చేరువచేయును.



ఇది తెలిసినప్పటికినీ జనులు అనుక్షణము ఇతరులను బాధించుచు, సంహరించుచు పాపకృత్యములను చేయు చున్నారే ఎంత విచిత్రమిది ! అంటూ ఆశ్చర్యమును వ్యక్తం చేసియున్నారు.

ముసలితనము, వ్యాధులు మరియు మరణము అను ఈ మూడు విషయములు మానవునికి దుఃఖమునే కలుగజేయును. అయితే ప్రతి జీవుడు సుఖమునే కోరుకొనుచు వీటి నుండి బయట పడవలెనని ప్రయత్నించును. సదా ఆరోగ్యముతో, యౌవనంతో దీర్ఘకాలం ఆనందముగా ఉండవలెనని కోరుచుండును. ఈ సుఖఇచ్ఛనే 'మోక్షఇచ్ఛ' అని శాస్త్రము పేర్కొంటున్నది. ఈ మోక్షము ఆత్మజ్ఞానము పొందుట ద్వారా సాధ్యము. ఆత్మ అజ్ఞానమే దుఃఖమునకు కారణము గనుక మానవుడు 'సుఖము కావలెనను' కోరికను 'ఆత్మజ్ఞానము పొందవలెనను' కోరికగా మార్చుకొనవలెను. ఆత్మజ్ఞానము పొందుటకై ప్రయత్నించవలెను.

**ఆత్మజ్ఞానము ఏవిధముగా సాధ్యము?**

ఆత్మజ్ఞానమనునది శాస్త్రశ్రవణము ద్వారానే సాధ్యము. ఈ శాస్త్రశ్రవణమును పరమగురువు ముఖముగా మాత్రమే చేయవలెను. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠా గురువు మాత్రమే సంసారము నుండి విముక్తిని ప్రసాదించగలడు.

నిత్యసుఖమును కోరుకొను మానవునికి 'గురువు' ఎంతగానో అవసరము.

శాస్త్రము ఏవిధముగా మానవునికి ఆత్మజ్ఞానమును ఇవ్వగలదు?

కొందరు శాస్త్రము మరియు గురువు ఆవశ్యకతను అంగీకరించరు. మోక్షమనునది ఆత్మజ్ఞానము ద్వారా సాధ్యము. ఆత్మ అనగా నేను. నేను నాకు చాలా సమీపము. నన్ను నేను తెలుసుకొనుటకు అనగా ఆత్మజ్ఞానమును పొందుటకు వెలుపల ఉన్న శాస్త్రముతో పనిఏమిటి? ఏదో ఒకనాటికి నేను చేయు ధ్యానము, యోగసమాధి మొదలగు వాటి ద్వారా ఆత్మ అన్వేషణ చేసి ఆత్మ అనుభవమును



పొందగలను. కనుక శాస్త్రాధ్యయనము అవసరం లేదు అన్నది వీరి భావన.

దీనికి రెండు రకముల వివరణలు మనకు లభించును.

1. శాస్త్రీయ సమాధానము : దీనికి శృతి, స్మృతి ప్రమాణము లున్నవి. ముండకోపనిషత్తులోని ఈ క్రింది మంత్రము శృతి ప్రమాణము.

**పరీక్ష్యలోకాన్ కర్మచితాన్బ్రాహ్మణో నిర్వేదమాయాత్ నాస్త్యకృతః కృతేన ।**

**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్ ॥**

(ముం. ఉ. 1. 2. 12)

ముసలితనము, వ్యాధులు మరియు మరణములను మూడు రకముల దుఃఖముల నుండి బయట పడవలెనను కొను ప్రతి ఒక్కరు పూజలు, యజ్ఞయాగాదులను కర్మలనెన్ని ఆచరించినప్పటికీనీ సుఖశాంతులు మృగ్యమని ఎరిగినవారై సమిధలను చేతపట్టి అంజలి ఘటించి ఆత్మవిద్యకొరకై వినయవిధేయతలతో గురువును సమీపించెదరు అని పై



మంత్రము తెలియజేయుచున్నది. అదే విధముగా స్మృతిప్రమాణమైన భగవద్గీతలోని నాలుగవ అధ్యాయము లోని ఈ క్రింది మంత్రము నందు

**తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।**

**ఉపదేక్ష్యంతితే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః ॥**

(భ. గీ. 4. 34)

అర్జునా తత్త్వదర్శులైన జ్ఞానులకడకేగి ఆత్మ జ్ఞానమును పొందుము. ఆత్మజ్ఞానము పొందగోరు ముముక్షువు సంప్రదాయ గురువును సమీపించి వినయవిధేయతలతో సాష్టాంగప్రణామములను చేయుటవలనను, నిష్కల్మషమైన భక్తి శ్రద్ధలతో వారిని సేవించుచు, జిజ్ఞాసతో సముచిత రీతిన ప్రశ్నించుట ద్వారాను వారు సంప్రీతులై ఆత్మతత్త్వమును ఉపదేశించెదరు అని కృష్ణ పరమాత్మయే గురువు ఆవశ్యకతను తెలియజేసియున్నారు.

'నా'ముఖమును నేను చూచుకొనగలనా? వీలు పడదు. (అద్దము) దర్పణము ద్వారానే చూడగలను. నా ముఖము నా వద్దనే ఉన్నది కదా మరి దర్పణముతో పనియేమని



మనము ప్రశ్నిస్తామా? లేదు. నాకు నేనుగా నా ముఖమును చూచుకొనుట సాధ్యపడదు గనుక దర్పణ సహాయము తీసుకొనెదను. అదే విధముగా సుఖ స్వరూపమైన 'ఆత్మ స్వరూపము' 'నేనే' అయినప్పటికినీ 'నన్ను' నేను తెలుసుకొనలేక దుఃఖించుచున్నాను గనుక శాస్త్రమను దర్పణము నాకు అవసరము. శాస్త్రమను దర్పణమునందు మన నిజ స్వరూప జ్ఞానమును గురువు మాత్రమే దర్శింపజేయగలరు. కనుక గురుప్రాప్తి ప్రతి ఒక్కరికి ఎంతో అవసరము.

ధ్యానము, సమాధిస్థితి మొదలగు సాధనల ద్వారా ఒక స్థాయి వరకు నేను యీ దేహము, మనసు కాదని తెలుసుకొనగలమే గాని 'నేనే' ఆత్మ స్వరూపమును అను ఆత్మజ్ఞానము కలుగుట మాత్రం అసంభవము. ఇది ఎరుగక, మేధాసంపత్తి, పాండిత్య గర్వము, సాధనల మహిమల వలన తమకు తామే ఆత్మజ్ఞానమును పొందగలమని, గురువు అవసరం లేదని విశ్వసిస్తు పెక్కుమంది ఆత్మజ్ఞానము పొందజాలకున్నారు.

**శాస్త్రజ్ఞోపి బ్రహ్మాన్వేషణం స్వాతంత్ర్యేణ న కుర్యాత్**

(ముం. ఉప. శంకరభాష్యం 1. 2. 12)

ఎంతటి మేధావులు, పండితులైనప్పటికిని శాస్త్రాధ్యయన మును గురుముఖతా మాత్రమే చేయవలెను. స్వతంత్రముగా చేయరాదు.

ఛాంద్యోగ్యోపనిషత్తు కూడా ఈ విషయమును ధృవీకరించుచున్నది.

**ఆచార్యాత్ హి ఏవ విద్యా విదితా సాధిష్ఠం ప్రాపతీతి**

(చాం. ఉ. 4. 9. 3)

"గురువు ద్వారా పొందిన జ్ఞానమే శిష్యునకు శ్రేయస్సునిచ్చును కనుక ఆచార్య! నాకు మీరు బోధించ వలసినది" అని శిష్యుడైన సత్యకాముడు తన గురువు గౌతముని ప్రార్థించెను.

2. జీవితములో గురువు యొక్క ఆవశ్యకత ఏమిటో మనకు అనుభవములోను విదితమే.

ఉదాహరణకు తమ పిల్లలు సంగీతము, నృత్యము, భౌతికశాస్త్రము... మొదలగు వానిలో ప్రావీణ్యము సంపాదించవలెనని కోరుకొను తల్లిదండ్రులు ఆయా రంగాలలో నిష్ణాతులైన గురువుల కొరకు అన్వేషించెదరు. వారివద్దనే తమ పిల్లలు విద్యనభ్యసించ వలెనను అభిలాషతో



వారివద్దకే పంపుదురు. ఇది లౌకికముగా మనకు అనుభవైక వేద్యము.

అదేవిధముగా శాస్త్రాధ్యయనము చేయవలెనని కోరు కొనువారికి కూడా నిష్ణాతులైన గురువులు అవసరమే కదా?

**ఎటువంటి గురువు అవసరము?**

గురువులు మూడు విధములుగా ఉందురు.

1. బ్రహ్మనిష్ఠా గురువు, 2 కేవల శ్రోత్రియ గురువు, 3. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠా గురువు.

**1. బ్రహ్మనిష్ఠా గురువు :**

వీరు శాస్త్రాధ్యయనము ప్రస్తుత జన్మలో చేయుకున్నప్పటి కినీ పూర్వజన్మలో శాస్త్రమును అధ్యయనము చేసి యున్నందున ఆ సుకృతము వలన బ్రహ్మనిష్ఠను కలిగి ఉండెదరు. కాని వీరు ఇతరులకు జ్ఞానబోధను చేయలేరు. కనుక ఇటువంటి గురువులను ఆశ్రయించుటవలన బ్రహ్మజ్ఞానము కలుగదు.

**2. కేవల శ్రోత్రియ గురువు :**

వీరు శాస్త్రమును బాగుగా అధ్యయనము చేసి పాండిత్యమును కలిగి వుందురు. కాని ఆత్మనిష్ఠ వీరికి



ఉండదు. అయితే వీరి బోధనల వలన శిష్యునికి బ్రహ్మ జ్ఞాననిష్ఠ కలుగుట సాధ్యము. కనుక వీరిని ఆశ్రయించ వచ్చును. వీరిని మధ్యమ గురువులంటారు.

**3. శ్రోత్రియ బ్రహ్మనిష్ఠాగురువు :**

వీరు సంప్రదాయరీతిలో సంప్రదాయ గురువుల వద్ద దీర్ఘకాలంపాటు శాస్త్రాధ్యయనము చేసి తాము స్వయముగా బ్రహ్మనిష్ఠను కలిగి ఉందురు. వీరు శిష్యునికి తమ బోధనల ద్వారా ఆత్మజ్ఞానమును ప్రసాదించగలరు. వీరు ఉత్తమ గురువులు. ఎంతో పూర్వజన్మ సుకృతమున్న గాని ఇటువంటి ఆచార్యులు లభించుట దుర్లభము.

మధ్యమ, ఉత్తమ గురువులు, అనగా కేవల శ్రోత్రియ మరియు శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠా గురువులే 'పరమగురువు'లు.

వివేకచూడామణిలో శంకరాచార్యుల వారు,

**దుర్లభం త్రయమేవైతద్దైవానుగ్రహ హేతుకమ్ ।**

**మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః॥**

(వి. చూ. మ. 3)



మానవునకు మనుష్యజన్మ, మోక్షము పొందవలెననెడి తీవ్ర ఆకాంక్ష మరియు మహాపురుషులైన పరమగురువుల సాన్నిధ్యము లభించుట కడు దుర్లభము అని వక్కాణించినారు.

ఘనత వహించిన సంప్రదాయ గురుపరంపర ద్వారా అందించబడిన వేదసంపద గల యీ సంస్కృతిలో జన్మించుట భాగ్యమని ఎరిగి మానవుడు ఆత్మజ్ఞానము కొరకై గురువు పాదములను ఆశ్రయించవలెను.

**గురుచరణాంబుజ నిర్భరభక్తః సంసారాదచిరాద్భవముక్తః ।**

**సేంద్రియమానస నియమాదేవం ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవం॥**

(భజగోవిందం)

ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము కలిగి గురువు పాదారవిందములను ఆశ్రయించిన వ్యక్తి భవరోగము నుండి విముక్తుడు కాగలడని శంకరాచార్యులవారు భజగోవిందము శ్లోకములో చెప్పినారు.

ఎంతటి సారవంతమైన భూమి ఐనప్పటికినీ సాగుచేయు రైతు లేనప్పుడు అది నిష్ఫలమే. సాగు చేయు రైతు ఉండి,

దానిని సాగు చేసినప్పుడే విత్తనం మొలకెత్తి చక్కని పంటను ఇస్తుంది.

శరీరము, మనోబుద్ధులు 'భూమి' వంటివి.

శాస్త్రము 'విత్తనము' వంటిది.

గురువు దానిని సాగుచేయు రైతు వంటివారు!

అనాదికాలము నుండియు ఈ విధమైన గురు-శిష్య పరంపర ద్వారా ఆత్మ విద్య అందించబడుచున్నది. ఇటువంటి ఉన్నత చరిత గలిగిన సంస్కృతిలో జన్మించుట మన భాగ్యము.

ముసలితనము, వ్యాధులు మరియు మరణమనెడు దుఃఖత్రయము నుండి విముక్తి కొరకై మోక్షఇచ్ఛ (సుఖ ఇచ్ఛ), శాస్త్రఇచ్ఛ మరియు గురుఇచ్ఛ అనెడి 'ఇచ్ఛా త్రయము'ను కలిగి సాధనత్రయములైన కర్మయోగము ద్వారా చిత్తశుద్ధిని, ఉపాసనాయోగము ద్వారా చిత్తఏకాగ్రతను మరియు శ్రవణమనననిధిధ్యాసన రూప జ్ఞానయోగము ద్వారా ఆత్మజ్ఞానమును పొంది మానవుడు శరీరత్రయ విలక్షణుడై శాశ్వతానందమును బడయగలడు.



ఆత్మజ్ఞానము పొందిన జ్ఞాని మతాతీతుడు. ఏ మతానికీ చెందినవాడు కాడు.

అటువంటి జ్ఞాని నాకు ప్రియమైన వాడు **'జ్ఞానీతు ఆత్మైవమేమతం'** అని కృష్ణ పరమాత్మయే స్వయముగా జ్ఞాని యొక్క గొప్పదనమును చాటినాడు.

**శిష్యుని లక్షణములు :**

పరమ గురువుల బోధనల ద్వారా ఆత్మజ్ఞానమును పొందగోరు ముముక్షువునకు ఎటువంటి లక్షణములు, అర్హతలుండవలెను? ఎటువంటి అర్హతలున్న మముక్షువు పట్ల పరమగురువు సంప్రీతుడై అతనికి ఆత్మవిద్యను ప్రీతితో బోధించెదరు?

చదువులతల్లి సరస్వతీదేవియే స్వయముగా తనను ఎటువంటి వారికి బోధించవలెనో పండితులను యీ క్రింది శ్లోకము ద్వారా ఆదేశించుచున్నది.

**విద్యాహవై బ్రాహ్మణ మాజగామ**
**గోపాయ మాం సేవధిష్టే హ మస్మి ।**



**అసూయకాయానృజవేయతాయ**
**న మా బ్రూయా వీర్యవతీ తథా స్యాం॥** (ఋగ్వేద సంహిత)

ఓ జ్ఞాన గురువులారా! ఎంతో జాగరూకతతో నన్ను పరిరక్షింపుము. త్రికరణశుద్ధి లేని వారి నుండియు, ఋజుత్వము పాటింపని వారి నుండియు, పరులక్షేమమును ఆశించని వారి నుండియు నన్ను ఎవరు పరిరక్షించెదరో వారిని నేను సంపదనై సేవకురాలివలె సేవించెదను. కనుక శిష్యుడైన వాడు విలువలతో కూడిన క్రమశిక్షణాయుత జీవితమును గడుపవలెను. విలువలనునవి హఠాత్తుగా సంక్రమించవు. ఉద్దేశ్యపూర్వకముగా దీర్ఘకాలము పాటించు క్రమశిక్షణే విలువలుగా మారును. క్రమముగా అవి అతని యొక్క సహజగుణములుగా శోభిల్లును.

పరమగురువు తన వద్దకు యోగ్యులైన శిష్యులు వచ్చుగాక అనుచు ప్రార్థించును.

**అమాయంతు బ్రహ్మచారిణ స్వాహా । విమాయన్తు బ్రహ్మచారిణ స్వాహా । ప్రమాయంతు బ్రహ్మచారిణ స్వాహా। దమాయంతు బ్రహ్మచారిణ స్వాహా । శమాయంతు బ్రహ్మచారిణ స్వాహా** (తై.ఉ. 1.4.3).



కనుక శిష్యుడైన వానికి వివేకవైరాగ్యములు, ఇంద్రియ నిగ్రహము (దమము), మనోనిగ్రహము (శమము), ఉపరమ, తితిక్ష, సమాధానము, ముముక్షుత్వము అనబడు సాధన చతుష్టయసంపత్తి ఉండవలెను.

దీనినే కృష్ణపరమాత్మ భగవద్గీత పదమూడవ అధ్యాయ ములో విలువలుగా చెప్పియున్నారు.

**1. ఇంద్రియ నిగ్రహము :**

**ఇంద్రియాణి ప్రకృతం శిక్షతే ఇతి శిష్యః**

'ఇంద్రియములను బహిర్ముఖము కాకుండునట్లు నియంత్రించువాడు' శిష్యుడు.

**ఇంద్రియార్థేషు వైరాగ్యమ్ అనహంకార ఏవ చ ।**
(భ.గీ.13.8)

ఇంద్రియ భోగలాలసత లేకుండుట అనగా ఇహ పర భోగముల యందు ఆసక్తి లేకుండ వుండవలెను. అహం కారము లేకుండ వుండవలెను. అహంకారము లేని మనసు మాత్రమే శాస్త్ర విషయమును గ్రహించగలదు.

**2. దోషదర్శనము :**

**జన్మమృత్యు జరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్ ।**

(భ.గీ. 13.8)

పుట్టుక, ముసలితనము, వ్యాధి మరియు మృత్యువు మొదలగు వానిలో దాగియున్న దుఃఖమనెడి దోషమును చూచు లక్షణము కలిగియుండవలెను. ప్రపంచములోని ప్రతి వ్యక్తి, ప్రతి వస్తువు మరియు ప్రతిబంధములోని లోటుపాట్లను గమనించుచు అవన్నియు దోషమిశ్రితమని ఎరిగి వాటి పట్ల అనాసక్తుడై ఉండవలెను. దీనినే 'ఆత్మవినిగ్రహః' అని కృష్ణపరమాత్మ చెప్పారు.

**3. మమకార రాహిత్యము :**

**అసక్తి రనభిష్వంగః పుత్రదారగృహాదిషు ।** (భ.గీ. 13.9)

గృహము, భార్యాపుత్రులు, సంపద మొదలగు వానితో మెలగుచున్నప్పటికిని వాని యందు మమతానుసక్తులు లేక తామరాకు మీద నీటి బొట్టువలె ఉండవలెను.



**4. సమత్వం :**

**నిత్యం చ సమచిత్తత్వమ్ ఇష్టానిష్టోపపత్తిషు ।**

(భ.గీ. 13.9)

ఎట్టి పరిస్థితులయందును ఇష్టా ఇష్టములకు వశము గాక మనోనిగ్రహము కలిగి ఎల్లప్పుడును ద్వంద్వాతీతుడై సమచిత్తంతో ఉండవలెను.

**5. అవ్యభిచారిణీ భక్తి :**

శిష్యునకు శాస్త్రము పట్ల మరియు దానిని బోధించు తన ఆచార్యుని పట్ల స్థిరమైన, నిర్మలమైన అనగా అచంచలమైన భక్తి శ్రద్ధలుండవలెను.

**గురువేదాంత వాక్యాదిషు విశ్వాసః శ్రద్ధా।** (తత్త్వబోధ)

భగవంతుని నిజతత్వమును బోధించు గురు వేదాంత వాక్యముపట్ల గల అపరిమితమైన విశ్వాసమే శ్రద్ధ. తనకు తెలియని, చూడని విషయమును బోధించు గురువు యొక్క మాటల పట్ల పరిపూర్ణమైన నమ్మకముండవలెను.



ఏ విధముగా పసిపిల్లవానికి తన తల్లిపై అపరిమితమైన నమ్మకముండునో శిష్యునికి కూడా తన గురువాక్యముపట్ల అంత విశ్వాసముండవలెను. అదే శ్రద్ధ.

శ్రద్ధావాన్ లభతే జ్ఞానం.

శ్రద్ధ గలవానికే ఆత్మాజ్ఞానము లభ్యమగును. ప్రతి ఆచార్యుడు వారి గురువుపై ఇటువంటి శ్రద్ధ కలిగియుండి జీవితములో ఉన్నతులైనారు.

**6. ఏకాంత జీవనము :**

**వివిక్తదేశసేవిత్వమ్ అరతిర్జనసంసది.** (భ.గీ. 13.10)

శిష్యునకు ఎల్లప్పుడును ఏకాకిగా ఉండుటకు ఆసక్తి ఉండవలెను. విషయాసక్తులైన జనుల పట్ల ఆసక్తి లేకుండ ఉండవలెను.

'ఆచార్య ఉపాసనం' అనగా గురు శుశ్రూష చేయుచు శాస్త్రాధ్యయనము చేయవలెను.

**'శాస్త్రపరిజ్ఞానేన బహిర్ముఖ అనపేక్ష్య విశిష్యతే ఇతి శిష్యః'**



శాస్త్రపరిజ్ఞానము పొంది అంతర్ముఖుడై ఉండువాడు "శిష్యుడు".

**7. ఏకత్వము :**

శిష్యునకు మనసావాచాకర్మణా ఏకత్వము ఉండవలెను. అనగా చేయు ఆలోచనలు, మాట్లాడు మాటలు మరియు ఆచరించు కర్మల మధ్య పొంతన ఉండవలెను.

ఇటువంటి వ్యక్తే క్రమముగా మహాత్ముడగును.

**8. శౌచము :**

శిష్యుడైన వానికి కాయక (శారీరక), వాచక (వాక్కు) మరియు మానసిక శుద్ధత ఉండవలెను.

నిర్మలమైన ఆలోచనలు, స్వచ్ఛమైన వాక్సంపదను కలిగి మంచి కర్మలను ఆచరించుచుండవలెను. అనగా స్వచ్ఛమైన నడవడిక అవసరము.

**9. క్షమ :**

శిష్యునకు అన్ని విషయములందు దుడుకుతనము లేక సహనశీలత ఉండవలెనని ఈ క్రింది శ్లోకము తెలియజేయు చున్నది.

**సహనం సర్వదుఃఖానామప్రతీకార పూర్వకమ్ ।**

**చిన్తా విలాపరహితం సాతితిక్షా నిగద్యతే ॥**

(వి.చూ.మ.25)

అపనిందావమానముల వలన కలుగు దుఃఖమును ఓర్చుకొనుచు, తనను బాధించు వారిపట్ల ప్రతీకార భావము పొందక మనోవ్యాకులత లేకుండుటయే క్షమ.

**10. ముముక్షుత్వం :**

మోక్షము కావలెననెడి తీవ్ర ఆకాంక్ష ఉండవలెను.

**అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్ ।**

**ఏతద్ జ్ఞానమితి ప్రోక్తం అజ్ఞానం యదతోఽన్యథా ॥**

(భ.గీ.13.11)

ఆత్మ విచారణ సంప్రదాయ గురువుల చేత బోధింపబడు మహావాక్య విచారణ ద్వారా మాత్రమే సాధ్యము గనుక శిష్యునికి శాస్త్రము పట్ల అత్యంత జిజ్ఞాస ఉండవలెను. శాస్త్ర వాక్యమే గురువాక్యము ద్వారా వెల్లడియగును గావున గురువు పట్ల కూడా భక్తి శ్రద్ధలుండవలెను.



**యథా ఖనన్ఖనిత్రేణ నరోవార్యథి గచ్ఛతి ।**

**తథా గురుగతాం విద్యాం శుశ్రూషురధిగచ్ఛతి ॥**

(మనుస్మృతి 2.218)

ఏ విధముగా మానవుడు గడ్డపలుగునుపయోగించి బండరాతి పొరల క్రింద నిక్షిప్తమైయున్న జలధారను (పాతాళగంగను) పొందగలడో అదేవిధముగా ముముక్షువైన శిష్యుడు తన శ్రవణ ఇచ్ఛాప్రయత్నముతో గురువులోని జ్ఞానగంగను పొందగలడు.

కృష్ణపరమాత్మ సూచించిన విలువలనబడు పై లక్షణము లన్నియు శిష్యునకుండవలెను.

శాస్త్రాధ్యయనమును ఒక తపస్సువలె భావించి అధ్య యనము చేసి శాస్త్ర ప్రావీణ్యమును పొందవలెను.

పరమపురుషార్థమైన మోక్షమును పొందుటకు ప్రయత్నించు మోక్షార్థికి ఇవి అత్యంత ఆవశ్యకము. ఇందు ఎటువంటి సందేహమునకు తావులేదు. ముముక్షువైనవాడు వీటిని శ్రమకోర్చి ప్రయత్నించును. ప్రతి విలువ కూడా తన



ఆధ్యాత్మిక ఉన్నతికి సోపానమని ఎరిగి వాటిని నిబద్ధతతో పాటించుటకు ప్రయత్నము చేయును.

**మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।**

**యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥**

(భ.గీ.7.3)

వేలకొలది మనుజులలో ఏ ఒక్కరు మాత్రమే 'నా' గురించి తెలుసుకొనుటకు ప్రయత్నించును. అట్లు ప్రయ త్నించిన వారిలో కూడా ఏ ఒక్కరో మాత్రమే నాతత్త్వమును ఎఱుగుదురని కృష్ణపరమాత్మ భగవద్గీతలో ఈ ఆత్మజ్ఞానము పొందుట కడుదుర్లభమని సెలవిస్తారు.

**మహతాపుణ్య పణ్యేన క్రీతేయం కాయనౌస్త్వయా ।**

**పారం దుఃఖోర్దధేర్గంతుం యావన్నభిద్యతే ॥**

ఎంతో పుణ్యఫలము వలన ప్రసాదింపబడిన ఈ మానవదేహమును నౌకనుపయోగించి జనన మరణ చక్ర మనెడు సంసార సంద్రమును దాటి జీవన్ముక్తి యను ఒడ్డుకు చేరవలెనని ఈ శ్లోకము హెచ్చరించుచున్నది.



కనుక మోక్షార్థియైన శిష్యుడు తన జీవిత గమ్యమైన ఆత్మజ్ఞానసాధనకై పూర్ణఅర్హతలతో గురుచరణములను ఆశ్రయించవలెను. అర్హతలు లేని శిష్యునకు శాస్త్రమును బోధించినచో అది అతనికి విషతుల్యమే అగును.

**"అజీర్ణే భోజనం విషం అనభ్యాసే శాస్త్రం విషం"**

ఉపమన్యు, ఆరుణి, నచికేతుడు, సత్యకాముడు, జాబాలి, ఉద్ధవుడు... మొదలగు వారెందరో ఉత్తమ శిష్యులై గురువుల వద్ద ఆత్మజ్ఞానమును పొందినారు.

**అజ్ఞః సుఖమారాధ్యః సుఖతరమారాధ్యతే విశేషజ్ఞః ।**

**జ్ఞాన లవదుర్విదగ్ధం బ్రహ్మాపి నరం న రంజయతి ॥**

(నీతి శతకము-2)

అజ్ఞానులు లౌకికసుఖములను ఆశించుచుండగా, పండితులు, మేధావులు స్వర్గాదిసుఖములే గమ్యముగా తలచుచు వాని కొరకు ఆరాటపడుచుందురు. ఇటువంటి అరకొర జ్ఞానము గలవారిని చివరకు బ్రహ్మదేవుడు కూడా తృప్తిపరచలేడు. వీరికి బ్రహ్మజ్ఞానము లభించుట కష్టము.

ఏ గురువూ తమకు తాముగా 'నేను గురువు'నని ప్రకటించుకొనరు. తమ సన్నిధికి వచ్చి 'నాకు ఆత్మవిద్యను బోధించవలసినది' అని ముముక్షువైనవాడు అర్థించినప్పుడే గురుస్థానమును పొంది పిమ్మట గురువులోని అమూల్యమైన జ్ఞానసంపద బహిర్గతమవును. అర్థించువాడు 'శిష్య స్థానము'ను పొందును.

**"శిష్యస్తేహం శాధిమాం త్వాం ప్రపన్నం"**

అంటూ శోకమోహములతో నిండిన బాధాతప్త హృదయముతో తనముందు మోకరిల్లి నాకు మార్గదర్శనము చేయవలసినది అనుచు అశ్రునయనములతో తన నిస్స హాయతను వెల్లడించుచు వేడుకొనిన అర్జునుని గాంచినప్పుడు కృష్ణపరమాత్మలోని ఆచార్యుడు అపారకృపతో బహిర్గతమై 'భగవద్గీత'యనెడి మోక్ష శాస్త్రామృతమును ధారాపాతముగా ప్రవహింపజేసి లోకమునకు జగద్గురువుగా ప్రకటితమైనాడు. ఆచార్యులు ఎంతటి కరుణారస హృదయులు!

మానవునిలోని దుఃఖమును రూపుమాపగల 'పరమ గురువు' అపార కరుణాసముద్రులు. అందుచేతనే 'ఓం



అహేతుక దయాసింధవే నమః' అని గురుఅష్టోత్తర శతనామవళిలో స్తుతించెదము. శిష్యునిపై వారికి గల దయకు, అనుగ్రహమునకు కారణమంటూ ఏమీ ఉండదు. దయాగుణము వారి స్వభావము. అదీ ఆచార్యుని యొక్క విశిష్టత. అందుచేతనే లోకమంతా వారికి 'శ్రీ గురుభ్యోనమః' అంటూ నీరాజనములను సమర్పిస్తుంది.

ఇంతటి ఉన్నతమైన గురు-శిష్య పరంపర ద్వారా అనాది నుండియు ఆత్మవిద్యాబోధన అజరామరంగా కొనసాగు చున్నది.

ఉత్తమ అధికారియైన శిష్యుడు మరియు దుఃఖత్రయము నుండి విముక్తిని తమ బోధనల ద్వారా అలవోకగా ప్రసాదించగల సమర్థులైన పరమగురువు, వీరి మధ్య ఆత్మ విద్యాబోధన జరిగి శిష్యుని యొక్క అజ్ఞానము తొలగి దుఃఖ విముక్తుడవును.

**ఈశ్వరో గురురాత్మేతి మూర్తి భేద విభాగినే ।**

(దక్షిణామూర్తి స్తోత్రం)



సత్యం, జ్ఞానం మరియు అనంత స్వరూపమైన బ్రహ్మ స్వరూపమే ఈశ్వరుడిగాను, గురువుగాను, జగత్తుగాను వివిధ నామరూపాలలో శోభిల్లుచున్నదనియు, ఆ బ్రహ్మమే తానని యెరిగినవాడై ఆనందాంబుధిలో ఓలలాడు హృదయముతో తనకు జ్ఞానచక్షువుని ప్రసాదించిన గురువుపట్ల, శాస్త్రము పట్ల కృతజ్ఞతతో

**త్వమేవ మాతా చ పితాత్వమేవ**
**త్వమేవ బంధుశ్చ సఖాత్వమేవ ।**
**త్వమేవ విద్యాద్రవిణం త్వమేవ**
**త్వమేవ సర్వం మమదేవదేవ ॥**

(గురుస్తోత్రము)

నాకు తల్లి దండ్రులు, బంధుమిత్రులు, విద్య, సంపద, సర్వము నా గురువే అంటూ పరవశంతో ప్రకటించును.

**శిష్యుని కర్తవ్యము :**

తనకు జీవన్ముక్తిని ప్రసాదించిన గురువును కృతజ్ఞతతో స్తుతించుట ద్వారా శిష్యుని కర్తవ్యము పూర్తికాదు. గురువు తనకు ప్రసాదించిన బ్రహ్మజ్ఞానమును శిష్యుడు



ముముక్షువులకు బోధించుట ద్వారా మరొక తరమునకు అందించుటయే గురువుకి సమర్పించుకొనగల నిజమైన 'గురుదక్షిణ'. అప్పుడే గురుశిష్య పరంపర సంప్రదాయము కొనసాగును. అదే ఋషిఋణం. మన సంస్కృతిలో దక్షిణ అనునది ఒక ఉన్నతమైన సంప్రదాయము. అది, తాను పొందిన విద్య పట్ల శిష్యుడు చూపు గౌరవము, తనకు విద్యను ప్రసాదించు గురువు పట్ల ప్రకటించు కృతజ్ఞతా భావము. అది ఆ పరమాత్ముని పట్ల, భగవంతుని నిజ స్వరూపమును వివరించు శాస్త్రము పట్ల ప్రదర్శించు భక్తి భావము. 'దక్షిణ' అను పదములో ఇంతటి అంతరార్థము ఇమిడి ఉన్నది.

కనుక ప్రతి శిష్యుడు,

1. తాను శ్రద్ధాభక్తులతో గురువేదాంత వాక్యము పట్ల అచంచలమైన విశ్వాసముతో శాస్త్రమును క్షుణ్ణముగా అధ్యయనము చేయవలెను.
2. తాను సముపార్జించిన జ్ఞానమును తన జీవితమునకు అన్వయించుకొనుట ద్వారా దాని కనుగుణమైన విధముగా జీవించవలెను.

3. బోధించగల సామర్థ్యమును పొందిన తదుపరి గురువు యొక్క అనుమతిని పొంది వారి ఆశీస్సులతో తాను పొందిన ఆత్మవిద్యను ముముక్షువులకు బోధించవలెను.

4. జ్ఞానప్రదాతయైన తన గురువును ఆజన్మాంతము కృతజ్ఞతతో సేవించుకొనవలెను.

ప్రతి తల్లికి తండ్రికి పిల్లవాని ఎదుగుదలలో పాత్ర ఉన్నది. అదేవిధముగా గురువు యొక్క పాత్రకూడా విశిష్ట మైనది. ఇక దైవము సదా మన జీవితములో ముఖ్య పాత్ర వహించును. కనుక వీరిని ఎన్నడూ విస్మరించరాదు.

సంతోషమును ఇతరులతో పంచుకొనగలము. కాని దుఃఖము నెవరితో పంచుకొనగలము? మన దుఃఖమును ఒక్క గురువు తప్ప మరెవ్వరూ తీసి వేయలేరు. కనుక గురువు సర్వదా పూజనీయులు.

**ఆజన్మాంతం త్రయం సేవ్యం వేదాంతో గురురీశ్వరః ।**

**ఆదౌజ్ఞానాప్తయేత్పశ్చాత్ కృతఘ్నత్వనివృత్తయే ॥**

(శ్వేతాశ్వతర ఉపనిషత్తు)



దైవమును, భగవత్తత్వమును తెలుపు శాస్త్రమును మరియు ఆ శాస్త్రమును బోధించు గురువుని జీవిత పర్యంతము సేవించవలెను. మొదట ఆత్మ జ్ఞానమును పొందుట కొరకు వీరిని ప్రార్థించవలెను, సేవించవలెను. ఆత్మజ్ఞానము పొందిన తరువాత కూడా వీరిపట్ల కృతఘ్నతా భావము తలెత్తకుండుటకై వారిని మరువకుండా కృతజ్ఞతతో పూజించవలెనని పై శ్లోకతాత్పర్యము.

**గురుపూర్ణిమ :**

మానవ జీవిత లక్ష్యమైన మోక్ష పురుషార్థము పొందుటకు దోహదపడు గురువులను పూజించుకొను సంప్రదాయము మన సంస్కృతిలో గలదు.

**అనంత శాస్త్రం బహువేదితవ్యం అల్పశ్చకాలః బహవశ్చవిఘ్నాః**

అపౌరుషేయమైన శాస్త్రము అనంతమైనది. అటువంటి శాస్త్రమును అధ్యయనము చేయుటకు మానవుని జీవిత కాలము సరిపోదు. అటువంటి అల్పమైన జీవితములోను ఎన్నో విఘ్నములు ఎదురవును. ఇది ఎరిగినవాడై సాక్షాత్



నారాయణ స్వరూపుడైన వ్యాసమహర్షి మొత్తం వేదములను నాలుగు భాగములుగా విభజించి తమ శిష్యులైన పైలమహర్షికి ఋగ్వేదమును, వైశంపాయన మహర్షికి యజుర్వేదమును, జైమిని మహర్షికి సామవేదమును మరియు సుమంత మహర్షికి అథర్వణ వేదమును అందజేయుట ద్వారా గురుపరంపరకు నాంది పలికినారు.

అందుచేతనే,

**నారాయణం పద్మభువం వశిష్టం**
**శక్తిం చ తత్పుత్ర పరాశరం చ ।**

**వ్యాసం శుకం గౌడపదం మహాన్తం**
**గోవింద యోగీంద్ర మథాస్య శిష్యమ్ ॥**

**శ్రీ శంకరాచార్య మథాస్య పద్మ-**
**పాదం చ హస్తామలకం చ శిష్యమ్ ।**

**తం తోటకం వార్తికకారమన్యాన్**
**అస్మద్గురూన్సన్తత మానతోస్మి ॥**

అంటూ ఆదిగురువు నారాయణుని మొదలుకొని నేటి గురువు వరకు అశేషముగా కొనసాగుచున్న గురుపరంపరను



స్మరించుచు పూజించెదము. ఆదిగురువు పరమేశ్వరునికి మనకు వ్యాసాచార్యులవారు వారధి వంటివారు. వారి ద్వారా మనకు అష్టాదశ పురాణములు, బ్రహ్మసూత్రములు లభించినవి.

ఆదిశంకరాచార్యులవారి మూలముగా భగవద్గీత, ఉపనిషత్తులు మరియు బ్రహ్మసూత్ర భాష్యములు మనకు లభించినవి.

**శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణం**

ఆది శంకరాచార్యులు సాక్షాత్ పరమశివుని అవతారము కాగా వేదవ్యాసులవారు విష్ణుమూర్తి అవతారము. వారు మనకు సర్వదా పూజనీయులైన పరమగురువులు.

ఇంతటి వేదఖనిని గురుపరంపర ద్వారా మనకంద జేసినటువంటి వ్యాసులవారిని కృతజ్ఞతతో స్మరించుచు పూజించుకొనుట మనకర్తవ్యము. కనుక ఆషాఢ శుక్ల పూర్ణిమ తిథినాడు అనగా 'గురుపూర్ణిమ' పర్వదినమున వ్యాసులవారిని పూజించుట ద్వారా గురుపరంపరకు మన కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

వేదనిధిని ప్రసాదించిన ఆదిగురువు పరమేశ్వరునకు ప్రథమ వందనము.

ఘనత వహించిన వేద సంపదయను భాండాగారమును గలిగియున్న భారతావనికి శతాభివందనములు.

వేదమును మానవాళికి బోధించుచున్న గురుపరంపర చరణములకు శతసహస్రకోటి పాదాభివందనములు.

ఆత్మజ్ఞానము పొందుట ద్వారా జన్మ చరితార్థమైన ప్రతి శిష్యుడు తన ఆచార్యునికి ఏది సమర్పించుకొన్ననూ అది వారు ప్రసాదించిన అమూల్యమైన ఆత్మజ్ఞానమునకు సాటిరాదు. అందుచేత

**సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం ।**
**అస్మదాచార్య పర్యంతాం వందే గురుపరంపరాం॥**

అని ప్రతిక్షణము కృతజ్ఞతతో గురువులను స్మరించు కొనుట ఈ సనాతన ధర్మములో సంప్రదాయముగా కొన సాగుచున్నది.

ఆచార్య దేవోభవ





## అక్షర విద్యా ట్రస్టు ప్రచురణలు

**A. నాదయోగము** MP3 CD/Tapes

1. స్తోత్రమాల
2. భజనావళి
3. భగవద్గీతా పారాయణము

**B. ప్రవచనములు** (తెలుగు) MP3 CD/Tapes

I. **భగవద్గీత (18 అధ్యాయములు)**

II. **భగవద్గీత భాష్యము**

III. **ఉపనిషత్తులు**

1. ముండకోపనిషత్తు
2. కేనోపనిషత్తు
3. కఠోపనిషత్తు
4. కైవల్యోపనిషత్తు
5. ఈశావాస్యోపనిషత్తు
6. తైత్తిరియోపనిషత్తు



7. మాండూక్యోపనిషత్తు
8. ఐతరేయ ఉపనిషత్తు
9. ప్రశ్నోపనిషత్తు

IV. **ప్రకరణ గ్రంథములు**

1. తత్త్వబోధ
2. భజగోవిందం
3. ఆత్మబోధ
4. వివేకచూడామణి
5. నారద భక్తి సూత్రములు
6. శ్రీరామగీత

**C. ఇతర పుస్తక ప్రచురణలు:**

I. **తెలుగులో**

1. ప్రార్థన
2. కర్మయోగము
3. వర్ణాశ్రమ ధర్మములు



4. ఈశ్వర స్వరూపము మొదటి భాగము
5. ఈశ్వర స్వరూపము రెండవ భాగము
6. మంత్ర జపము

II. **ఇంగ్లీషు మరియు తమిళములో**

1. కర్మయోగము
2. వర్ణాశ్రమ ధర్మములు

**D. DISCOURSES (English) MP3 CD/Tapes**

**I. Bhagavadgita**

1. Gita (18 Chapters)
2. Gita - Shankara Bhashyam
3. Gita - Summary (Chapters 1-18)

**II. Upanishads**

1. Mundakopanishad
2. Kenopanishad
3. Kathopanishad
4. Prasnopanishad

5. Kaivalyopanishad
6. Isavasyopanishad
7. Taittiriyopanishad
8. Mandukyopanishad
9. Chandogyopanishad
10. Brihadaranyakopanishad
11. Aitareyopanishad
12. Summary of Upanishads

**III. Upanishad Bhashyam**

1. Mundaka Upanishad Bhashyam

**IV. Brahma Sutras**

**V. Prakarana Granthas**

1. Tattva Bodha
2. Bhajagovindam
3. Guru Stotram
4. Dakshinamoorthi Stotram
5. Vishnu Sahasranamam
6. Shivaparadha Kshamapana Stotram/ Gayatri Mantram



7. UpadesaSaram
8. JeevaYatra & Sadhana Panchakam
9. DrikDrisyaVivekam
10. Hastamalakiyam & Nirvana Shatkam
11. Kamalajadaitashtakam
12. VairagyaSatakam & Guided Meditation
13. Aditya Hridayam & Patanjanli Yoga Sutras
14. Deep Relaxation Technique & Introduction to Yoga
15. Vakya Vritti
16. Advaita Makarandam
17. Sanat Sujatiyam
18. Rama Gita
19. Eka Sloki, Vidura Neeti & Concept of Health & Yoga
20. Astavakra Gita
21. Kapila Gita
22. Vedanta Dindima
23. Saddarshanam



24. Vedantasara
25. Aparokshanubhuti
26. Upadesa sahasri

**VI. General Talks**

1. Gurupoornima Talks
2. Shivaratri Talks
3. Dayananda Panchakam

**VII. Videos**

1. Bhishma Sandesham (Telugu)
2. Yogasanas (English)
3. Nadopasana
    1. Mind Management - Part 1
    2. Mind Management - Part 2
    3. Mind Management - Part 3